శ్రీరస్తు.

# ఆపద్బాంధవ శతకము.



కృష్ణాజిల్లా ఏలూరు తాలూకా

ఖండ్రిక, సీతారామపుర వాస్తవ్యులగు

గన్నవరపు వెంకటరాయకవి

విరచితము.




ఏలూరు, మంజువాణీముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడి ప్రచురింపఁబడియె.

1924.

శ్రీరస్తు.

# ఆపద్బాంధవ శతకము.



కృష్ణాజిల్లా యేలూరు తాలూకా

ఖండ్రిక, సీతారామవరవాస్తవ్యులగు

గన్నవరపు వెంకటరాయకవి

విరచితము.






ఏలూరు, మంజువాణీముద్రాక్షరశాలయందు,

ముద్రింపఁబడి ప్రచురింపఁబడియె.

1924.

# పీఠిక.

అయ్యా,

బుధవరేణ్యులారా!

నేనేవిద్యయందు నారితేరని జనుఁడనగుటం జేసి నా తోఁచినకొలంది భక్తిజ్ఞానవైరాగ్యంబుల కిరవగు నీశతకమును వ్రాసినాఁడ. చదువరులకిందు తప్పులు దొరకకపోవు. ఒప్పులనే గ్రహింపుడు. ఈ శతకము నొనర్చుటకు గల కారణ మీక్రింది పద్యములతో విశదపరచుకొనుచున్నాఁడను.

సీ. శ్రీరాఘవాన్వయ • సింధుసుధాంశుండు
వేంకటపతిరాజు • వీరుఁడలరు
నామహీశుని పుత్త్రి • నైనరంగక్షితి
పాలరత్నము గుంటు • పల్లిరాజ్య
ధనుఁడు శ్రీవీరప్ర • తాపకోదండరాం
వీరవెంకట లక్ష్మి • నారసింహ
నారాయణాభిఖ్య • నరవరదత్తమౌ
తాలుకాదారిని • తగధరించి
దౌహిత్రుఁడై క్షితి • దైన్యంబుబోనాడి
పుత్త్రులతోపాటు • పూన్కి ప్రజల

తే.గీ. పాలనము జేయుతలితండ్రి • బహుళముదము
గదుర రంగావనీశుండు • గణనకెక్క
రంగ దరిభంగ సంగతో • త్తుంగకీర్తి
సద్బుధాలోక సన్మాన • స్వప్రసక్తి.



శ్రీరస్తు.

అవిఘ్నమస్తు.

శ్రీశారదాంబాయైనమః.

# ఆపద్బాంధవశతకము.

శా. శ్రీలక్ష్మీసుమనోజ్ఞబంభర జగ ♦ చ్ఛ్రీపద్మ పద్మాదిరా
నీలాభ్రప్రతిమాన మంగళతనూ ♦ నిస్తుల్య సౌందర్య స
ల్లీలాకల్పిత పద్మజాండనికరా ♦ లేఖా సురానీంద్రది
క్పాలౌఘాద్య చరాచరాఖిల ధరా ♦ పద్బాంధవా శ్రీధవా.

మ. అనఘా యున్నిటవ్యర్థుఁడన్వివిధమున్ ♦ మాయాంధముల్మ్రొంగుఁ జే
వనమా సత్య పరాఙ్ముఖుండ కను నా ♦ భావంబునీ పాదసే
వనమా చేయఁ సమీకరింపదెపుడే ♦ పాళ్లున్నవో జన్మపా
వనమా ధారమ వీవెగాదలఁతునా ♦ పద్బాంధవా శ్రీధవా.

మ. అవురా యెవ్వరికేనెమి కారణము ని ♦ ర్వ్యాకాంక్షయే లేక వు
ట్టువు గల్గెన్నిక నెంతకాలమిది యె ♦ ల్లోలీనమా మార్గమం
చవధానమ్ముగఁ జర్చసేయ తుదిదు ♦ స్సాధంబు రా చిత్తమా
పవమానాంధశయాన తెల్పఁగదె॥ యా॥ 3

మ. సతులాపుత్రుల్ సుతులాదిగాఁగలుగు నీ ♦ సంసారపాథోధిని
సతతమ్మంచు దలంచు నంధు నను పే ♦ సాన్నిధ్యముం జేర్పది
వ్యతరంబై యసమానమై యలరు భ ♦ వ్యజ్ఞానదృష్టిం దయా
పరనాకిమ్ము సదాజొహారులికనా ♦ ప॥ ౪

మ. అవతార ప్రథితావితోర్వర నిరా ♦ ధారాభయప్రాభవా
నవపుష్ప ప్రకరైకకోరకమిళ ♦ న్నానా ఫలానీక సం
భవనాకార సుహృద్ద్రుమా నిరుపమా ♦ భవ్యప్రతాపక్రమా
భవదారాధనమానసజాలనిక నాప॥ ౫

మ. సకలాధారుడ వప్రమేయుడ వన ♦ చ్చారిత్ర నిర్మాలనై
కకళాపాంగుడంచు నిన్నెఱిగియున్ ♦ కాసంత నీధ్యానమో
యాకలంకాత్మయొనర్పఁజొప్పడదునా♦హాబుద్ధిమాంద్యంబునీ
వ కదా దుల్పఁగలాఁడ వెల్లపుడు నాప॥ ౬

మ. కవితాశక్తియు శాస్త్రభక్తియును స♦త్యాగాద్యధికోద్యుక్తియున్
సవిశేషంబగు ధారణావసతి స ♦ త్సాంగత్య సంపత్తియున్
యవినీతుల్ స్తుతులొక్కపోల్కిఁగనుట♦న్నాపై మహాభక్తియున్
భవ్యకం బంద్రుతదాప్తినాకిడుము॥ యా॥ ౭

మ. భవరత్నాకరమీఁద జాలనెటులన్ ♦ బాల్పోదు నాబుద్ధి త
ద్వివరంబేమియు యపారసంస్కృతియొనా♦విజ్ఞానహీనంబొ కా
లవశంబోగనుగొందు నెవ్విధిసిక♦ల్లల్ గావునీమ్రోలఁబో
వవయా తావక నామమందలతు నాప॥ ౮

మ. కరుణాసాంద్రుడవంచు చెప్పకరిసునీ♦శౌర్యావళుల్ సెప్పెదన్
గిరికేల్ ధరియింప శక్తిడడలెన్ ♦ కీర్తుల్ దిశాంతంబులన్
వరలెన్ ఘోరజలగ్రహంబు పిరుగన్ ♦ వర్ధిల్లెనాగంబుదా
పరమా న స్సునఘూత్మ్ముఁజేయగదె ॥యాప॥ ౯

మ. అపచారంబులొనర్చినాఁడననుమా♦యయ్యా దయంజూడవే
జపహోమవ్రత దానధర్మములనే ♦ సాంతమ్ముగాఁజేసి నా
నుపకారోజాతుయటంచు దెల్పుదునొమా♦నోజ్జత్వమిప్పాటనే
తపముల్ జేసితినంచు దెల్పుదునొవా♦దంబేలనన్ బ్రోవగా
బ్రపదంబొప్పగ వేడుకొందునిను నాప॥ ౧౦

శా. గర్వోద్ధత్యముచేతనో తెలియకో ♦ ఘోరంబులెన్నేని దు
ర్లోపంబుల్ బచరించియుందునుగదా ♦ లుబ్ధంబులందోలిచి నీ
దాపుంజేర్పుముజన్మకర్మముల సం ♦ తాపంబులేకుండ నీ
ప్రాపుంజేరద పాపముల్ దొలఁచు నాప॥ ౧౧

శా. ఆర్తుండౌనపుడేనినుందలచువాం ♦ ఛార్థప్రమోదాత్ముఁడై
కర్తన్నేననిహాంకరించుపటువి ♦ ఖ్యాతిడితోన్మాదుఁడై
మర్త్యుండీవిధినెంచుస్సృష్టిరచనా ♦ మార్గంబునన్ మగ్నుఁడై
వర్తిల్లన్ వలెగాదెనీవలన నాప॥ ౧౨

మ. బలుకార్యంబులొనర్చువేళల సదా ♦ భావంబు నీపాలుగా
వలెనంచున్ గురిగూర్చికాలమును నె ♦ వ్వాడిట్లు బోఁజూచునో
నిలనాధన్యునకీజగంబు కలయే ♦ నిమ్మాడ్కి యోజింపనా
వల నీవాతఁడె యాతఁడీవుగదయాప॥ ౧౩

శా. కోపంబింతయులేకనాపయిక్రృపా ♦ కూపార! కాపాడుమా
లోపంబెంతయుజేయలేదననెటుల్ ♦ లోగొన్ము నీవాఁడనా
దాపింతేనియుగానరాదుతనువుల్ ♦ దాత్పర్యమర్పించితిన్
పాపంబుల్ క్షమియించుమా త్రి హారయాప! ౧౪

మ. కరులున్ వారుణముల్ ధనాధికములున్ ♦ కారిత్రాసమా
[హంబులున్
శరదంబుల్ స్ఫురదంబరా భరణముల్ ♦ నానావనోద్యా
[నముల్
గిరులున్ మిత్రులు బంధుగుల్ వృథలు నిన్ ♦ గీర్తింప లే
పరమాత్మా! యవినిష్ఫలావధులె యాప॥ [కున్నచో] ౧౫

మ. వరవిజ్ఞానులునత్కళాప్రవరులున్ ♦ వాణీశులున్నీశులున్
నరులున్ కిన్నరులున్ గుణాగుణులు న ♦ న్నంతేని బ్ర
[హ్మాత్ముం

దరిరూపుల్ పరికింపనేవెరకదని ♦ ద్ధాత్రిన్ మహానాట్యమీ
వరయుంజూపెదుగాదె విస్మయతినాప॥ ౧౬

మ. గరుడారూఢునిగా గజార్తిహారుగా ♦ కందర్పసంహారుగా
సరసీజోద్భవుగా పరాత్పరునిగా ♦ సత్కార్యవర్ధిష్ణుగా
సురవాట్ప్రభుగా గణింతును పరే ♦ శున్నిత్యసామ్రాజ్యహృ
త్ప్రవర్తిన్ గనలేక చంచలతినాప॥ ౧౭

మ. ఉదయాద్యస్తమయాంతమున్నిగులనే ♦ యోజంబ్రవర్తిం[తునో
సదయా యయ్యవినీపరంబొసంగనీ ♦ సద్బుద్ధినాకీయు వే
డెద నాపన్నశరణ్యసద్విరుదమీ ♦ జేసీకునిక్కంబు దా
ప దయాబ్ధీ తరమే వరంబొసగుమాప॥ ౧౮

మ. శతకంబుల్ రచియింపఁగా గడగితిన్ ♦ సాగించు నీయుద్యమం
బతిదుర్లంఘ్యమటంచు దోఁచు హృదిదా ♦ ర్బల్యంబు బో[కార్చియుం
జతరాచ్ఛత్రిదశాపగాలహరి వి ♦ స్ఫూర్తి స్ఫురద్భంగ స
త్త్వతరంబౌ కవితాప్రసక్తి నిమమాప॥ ౧౯

మ. గవిశేజంబొసఁగున్ సుధాకరుఁడు తో ♦ యంబొస్గ వెల్లింటిసం
బు విధీశాదులు స్వస్వకార్యకరణా ♦ భ్యుత్సాహతన్ పంచభూ
త వితానంబతిసుప్రధానతకునన్ ♦ బ్దంబుల్ పయఃపూర్తికిన్
భవదాజ్ఞాపరతంత్రులై నడతురాప. ౨౦

మ. అవిచార్యంబజమప్రతర్క్యమజరం ♦ బానందసంధాయకం
బవిరాళం బతిసంస్తవంబఘహరం ♦ బవ్యాజమాశ్వాసితం
బవలీలోద్యమసంభృతంబతిశయం ♦ బచ్ఛంబనిర్వాచ్యమో
భవదుఃఖాపహానీ మహామహిమమాప. ౨౧

మ. వరయజ్ఞంబుల దేవతావరుల సేవన్ బంచయజ్ఞంబులన్
వరవిన్ మానుషయజ్ఞముల్ నొనరుపన్ సాయమ్మునద్వర్తనం
పు రయమ్ము న్నిక జన్మకర్మనిధనంబున్ నమ్మి విద్వత్కథా
పరతత్త్వాదిగుణమ్ములిమ్ము పరమాప॥ ౨౮

శా. అంధుండగ్నికణంబు ద్రొక్కవనటన్ నాకోశమున్ జెందునే
సంధిం బ్రాప్తసులోచనుండు దహనున్ శాల్యన్నపక్వార్థియై
బంధించున్ గదనెట్టివారికటులన్ బ్రత్యక్షమౌ సర్వసం
బంధజ్ఞుండవు వీతబంధుడవు నాప॥ ౨౯

శా. రేపున్మాపును రాత్రులున్ బవలు నిర్ణీతాదికాలంబులన్
రాపింతేసియు లేకనిన్ సతము నారాధించు సన్మాన్యులే
లోపంబుల్ దిగనాడి ధన్యతమునిన్ లోగొంచు కీర్తింపరే
పాపారణ్యకనద్దవానల మహాప॥ ౩౦

మ. నిగమాంతః ప్రథితా నిరామయరతా నిర్వ్యాజభక్తస్తుతా
నగరాట్ సంభృతసువ్రతాః యయుతా నానావనీపాన్వితా
జగదారాధితసాధువాదవిహితా జన్మాంతసంవర్ణకా
భగవంతా! యఘుహంత శాంతికలితాప॥ ౩౧

మ. నిగతానందసురప్రకల్పిత సుఖానీకామృతాధారకా
మరథారూఢజనప్రమాద మదిరోన్మత్తాతిదుర్లభ్య స
జ్జనాసప్రకరాతిమానిత విధాధ్యానందసల్లభ్యప
త్పరమార్గానుచరప్రధాన పరమాప॥ ౩౨

మ. వరదానవ్రతమంత్రతంత్రవిద సర్వాధారబృందారకా
దరదామోదఃఖేదమోదసమశ్రీదా వేదమోదవ్రతా
కరదాక్షిణ్యగుణాబ్ధికా పదవారాకంజోద్భవాదిస్తుతా
పరదారార్థి పరప్రబంధనరతాప॥ ౩౩

మ. మునుజన్మంబులనెన్ని నేగడపితిన్ ముందెన్ని జన్మంబులో
నా నయారేవిషయానురాగరతినై యుంటిన్ యజంబాళటన్
జనిమేతన్నిక బాముమాతబమునో జన్ సంసృతిన్ మగ్నమై
వనటన్ జెందితిహా స్తమూశనిమమాప॥ ౩౪

మ. ఉసురుల్ పోవఁడిదాఁకనీతనువుకా మోద్యోగభోగంబులన్
విసువుం జెందదు సృష్టితత్త్వమును నేనేశం దలంపంగ బో
దు సుమాసుత్రిఁ దెగురుందుగా జనులు విఘ్న్యకంబుల జూడకా
పసువుల్ వోలె చరింత్రు లోకమున నాపద్బాంధవా.

మ. ఒకఁడో పెక్కురొ నిర్గుణం బగుణమో యూహింపన
చ్ఛ్యాంతమో
సకలమ్మాది మహాప్రమేయ పరమస్వాధిష్ఠితబ్రహ్మమో
శుకప్రహ్లాద పరాశర ప్రముఖులు శ్లోకుల్ నినుం జెప్ప తా
వక నామస్మరణంబు శేతునిక నాప॥ ౩౬

శా. ఇలపై బాల్యమునందునాఁడి, పరువం బీడ్వంగ స్త్రీలోలుడై
గల కౌమారమునన్ కటుంబపరతన్ గాలంబుబోనాడ నే
వలనం వృద్ధగువేళనిన్ దలచు నబ్బా! దుష్కరంబీవిధిన్
ఫలితాంశంబు గసంగలెట్టులిక నాప॥ ౩౭

మ. కలుముల్ గోరను కాంతలన్ బడను నేగాఁ సంబదోషంబుగా
నిలనిప్పింతువొ జానసంతసిలెదన్ నీపాఁ పెగాంక్షింతు నా
తెలివిన్ దేటలు హెచ్చవింతియెగ్యపాదృష్టిన్ గటాక్షించినా
వలనన్ దోషములున్న సైపదగు నాప॥ ౩౮

శా. నేనీకార్యము నిర్వహించితిని నేనే కార్యధుర్యుండ నా
కేనాడున్ పరులేసహాయమును నొక్కింతైన జేయంగ లే
దే నేనీధనధాన్య సంపదల నర్థింగూర్చినా నంచనన్
వానిన్ బాలునిగా నెఱుంగుదగు నాప॥ ౩౯

శా. కానెవ్వండొ తనూబల చెవటనో ◆ ధన్యత్వ మేజాడనో
తానేనీరు రునొక్కరుండైన తో ◆ ద్దో దేహమగ్నిన్ లయం
బానేమయ్యెనొ తాసుదీనుమను౯ బ్రో ◆ చాపాయమును బాపిగో
పనమా దానిసెఱుంగ జేయుమిల నాప ◆ ౪౦

శా. ఎంత దాక తివాంఘ్రి పద్మములనె ◆ న్నే పాళ్లు వాటిల్లి నన్
చింతింపన్ బనిబూను పావనుమునుల్ శ్రీ ◆ లందు దుర్వృత్తిమై
పంతంబుల్ పచరించు మూర్ఖుమనిరా ◆ పాయంబు ప్రాప్తించునా
వంతైనన్ విధిదాటనేరి తరమా ప॥ ౪౧

మ. అలుఖ్యుల్ జీవుల బ్రహ్మయుక్ మొదలుగా ◆ నలయుగ్యమైయు
ప్రాణుల్ సదా
తనప్రాణంబు బలెన్ యహింసమె మహా ◆ ధర్మంబనన్ బల్కు శ్రు
త్యనుగుణ్యంబుగ నాప్రవర్తనముది ◆ ద్దనొంగోరి నానయ్య నీ
వనుమానింపక నన్ను నేలుకొనుమా ప॥ ౪౨

మ. తనవారున్ బెరవారునాకను యథా ◆ ర్థజ్ఞానతత్త్వజ్ఞుడై
కనుసర్వంబుననొక్క టేవిధముగా ◆ గన్ నిస్పృహత్వంబుచే
తనుసత్యంవదయంచు బల్కు శ్రుతులా ◆ ధారంబుగా బూని పా
వనతన్ వర్తిలునట్లు చేయుమభవాప॥ ౪౩

మ. నిరుపేదత్వమునన్ గృశించుతరి నెం ◆ దేనిన్ పరార్థాపహా
ర్యరతిన్ జెందక దాత్రిశుద్ధినొరుల ◆ న్నారీతి బోధించుచున్
విరతిన్ బూనిన సత్ప్రవర్తనము నె ◆ వ్వేళన్ బుధాళ్లోనమా
పరమార్థేయ విధిన్ ననున్ నడపుమా ప॥ ౪౪

శా. ఆజన్మాంతము బ్రహ్మచర్యము నర ◆ ణ్యావాససంసర్గము
త్తేజంబొప్పగృహస్థధర్మమును బ ◆ త్నీపుత్రసంయుక్తుడై
యోజన్ సల్పుట బ్రహ్మచర్యమునకున్ ◆ నొప్పారు ధర్మంబుల
వ్యాజప్రక్రియ బూనసాయపడుమా ప॥ ౪౫

మ. పరశుంగేలధరించిరాజవితతిం • బల్మారుఖండించి త
చ్చిరనిర్ముక్తసురక్తధారుల పితృ • శ్రేయాప్తికై తర్పణల్
వరుసం జేసి తదుత్తమాంగతతి సో • పానాళి నాకాధ్వమై
బరగింపం భృగురామరూపధరాప. ౫౨

మ. తనరం రోహిణి గర్భంబు శుభ్రవరము • క్రా పల్యతం రేవతీ
ఘనసాధ్విం వరియించి కృష్ణుననుజుం • గా బేర్మిలాలించితో
డనదుర్మార్గం చరప్రలంబముఖరా • డంబంబుబో కాచిం నా
వనయంబుం బలరామరూపవరమా. ౫౩

మ. జగమందంతట జీవహింసయున వీ • సంబైన శంకింపకం
నిగమోక్తక్రతుజాలముల్ నడపుచో • నీవంత యుక్తంవ క్తవై
తగదీహింసయటంచు దెల్చి జగమం • తంద్రిప్పి బోధించితీ
వ గురూత్తంసమబుద్ధరూప. ౫౪

శ్రితికన్యాన్నములమ్మసత్కులవిధుల్ • శూన్యంబుగా తథ్యమున్
మతిసంధింపక దేవభూసురవరా • మ్నాయమ్ములన్ ద్రోచిదుః
ఖితమం బై కమదుర్నిరీక్షమగు లో • కంబుద్ధరింపం న్నిలా
పతివై పుట్టెదు కల్కిరూపధరయా॥ ౫౫

మ. వసుధాభారనివారణార్థముగదు • రై వ్యదగ్ధలోకంబు లిం
పెసంగింపం సమయించిగోపతతిగో • పీవర్గగోసంతతో
ల్లసనంబుల్ సమకూర్చి యుద్ధవవరా • హ్లాదంబు గావించితీ
వ సుహృద్బాంధవ కృష్ణరూపధరాప॥ ౫౬

మ. అపరిచ్ఛిన్నమనంతమవ్యయమునై • యాద్యంతరాహిత్యమై
యుపమింపం బహుదుష్కరంబగుచుది • వ్యోరుప్రభామాలమై
మఫలావాప్తిసుపర్వభూజమయిని • స్తుల్య ప్రభోద్దామస
త్వపథాశ్యంచితధామమై యలరుదాప॥ ౫౭

మ. కలదానిం గలయట్లజూతమనగా ♦ గాన్పింపదామార్గమిం
దులకో లేనిదియున్న యట్టులుగనే ♦ దోపించునీకై వసుల్
దెలియం వేరుగదా మహామహులునీ♦దేగా దెయామాయనీ
వలనం దానినెరుంగబోలుగద ఆప॥ ౫౮

మ. జ్వరితార్తుండెటుబాధనోవునిక స్వే♦చ్ఛావృత్తి నెన్నండునం
లరుగం ద్రిమ్మరువాడనంచు మది♦డిల్లంబోవునా చొప్పునం
నిరతంబుం భవరుగ్మతం బడలితిం ♦ నీపాపునందెప్పుడుం
పరగం వర్తిల నాజ్ఞనీగదె మహా ప॥ ౫౯

మ. కనుఱెప్పంగనిమనంతలో సహాయం♦కంజోద్భవ సృష్టియం
దునసంతబగు జీవులుద్భవిలి యం♦దుంగ్రమ్మగు వర్ణింపగా
ననయంబేరికి సెక్కమా యభవ నా ♦ కత్యద్భుతంబిద్ది పా
వనమూర్తీ తెలుపంగబూను మదియా ప॥ ౬౦

శా. కష్టండాల్ దొరమాయలో బడిబలా ♦ కైదండ కాన్పించకన్
ముష్టంజెందితి నీపదాత్రయ విధిం ♦ మోసంబువాటిల్లెనో
చెప్పంజూడ వినంగరాని పరమ ♦ శ్రీమాన్వితా వేగ నీ
వప్పండిరిచి తెప్పదేల్పుమిక నాప॥ ౬౧

శా. పాలున్నీరును గుర్తెఱింగి జలముం ♦ వర్జించిక్షీరంబుదా
నలగ్రోలంగల హంసపోలెనినుమా♦యాకృష్టసంబంధుసన్
దిలకింపం దలపెట్టుమానవుడు దా ♦ నుత్తీర్ణ జన్మంబు కే
వలుడౌతండిల సంసృతీతరుణుడా ప॥ ౬౨

మ. కొఱగానట్టి ప్రవృత్తులం మఱగియెం♦గ్గుంలగ్గు యోజించకన్
కరుణాళుండగునిం స్మరింపకవ్యథల్♦గాంక్షింపకేవద్భుదో
నిరతంబుం మదిగుందుచుందునరుల ♦ న్నీవెన్నడుం జూడనో
పరుడా మూఢులు నిన్నసంగలరె యాప॥ ౬౩

మ. గురుమంత్రంబను కీలకమ్ములను యు♦క్తుంజేర్చి సంప్రీతిమై
బరగం జావునుపుట్టుకల్ విపులభా♦వంబందు సంసిద్ధమై
వరిశైరాగ్యము దాటిజూపగను ది♦వ్యజ్ఞాన సంధానుడై
వరలం గన్నీ పదపద్మసేవగన నాప॥ ౬౪

మ. కలుగుంగాదె సమస్తసృష్టియును ది♦క్కాలానవద్యంబుగా
కలుగుంగాదె చరాచరంబు జగతీ♦ కల్యాణసంధాయియై
జ్వలియించుం గద యీసమస్తమును ని♦చ్ఛామాత్రమై దేవనీ
వలనం గన్నన్భవాబ్ధిదేల్చుమిక నాప॥ ౬౫

మ. శమ జిజ్ఞాస ముదమ్ము సజ్జనప్రసం♦గల్ జూడ నీనాంబుగుం
క్రమమొప్పం ఫణిహారులై తనరిరో♦గమ్య ప్రభూ నీను సౌ!
ధము నందుం యవలీలవారిగమవం♦ ధన్యున్నినుంజేర దా
పముతో ప్రొక్కితిప్రేగు మాన్పికొనుమా ప॥ ౬౬

మ. అకటా పెక్కుభవంబులంబడసియా♦యాసంబువృద్ధత్వముం
వికలత్వమ్మును జెందినాడ సక నీ♦వేదిక్కుగా పారమా
ర్థికసంపత్తికి హేతుభూతమగు స♦ద్విజ్ఞానముంగూర్చిగా
వక యున్నం నను బ్రోచువారలెవరాప. ౬౭

మ. వలదీసౌఖ్యము దుఃఖముం జననమే♦నంకం శ్రుతుల్ తక్కుత్ప్రపా
సలుసుం గ వికనింద్రియంబులు మన♦స్సామిథ్యబుద్ధ్యాత్మకం
బిలబ్రహ్మంబయి తాదలిర్చగనుమీ♦ విన్నింటికాధారమై
పలుకం లేని జనార్దనాహ్వయమహాప. ౬౮

మ. శరణార్థిం ధరణీశతాంగనుతనీ♦ సామర్థ్యమేమందు ధీ
శరఘుల్ యోగులకై సదుర్లభమెదు♦స్సాధ్యంబె కాదేంతి
వరమా సత్తపముల్ బొనర్పగతమై♦భృంగిం బ్రవర్తించునో
పరమామ్నాయవిదా సదాత్మకమహాప. ౬౯

మ. చదలున్ ధారుణినీరమగ్ని భవదా♦జ్ఞన్ మీరి వర్తింప వె
ఱ్ఱ్యదె యెట్లుండిన నీవె మూలము మహా♦ప్రారంభమే
[నీది నీ
పదమెవ్వండు గనంగనోపు నచల♦బ్రహ్మస్వరూపుండవై
పదునాల్గుంభువనంబులందెదుగదాప. ౨౦

మ. నిను సర్వాత్ముడవందునో ఘనకృపా♦నీరాకరాత్ముండవం
దునో గర్వాంధజనాటవీ చటుల ద♦గ్ధుండనటం చెంతునో
మునిహృత్పద్మవనీవిభాస విస్ఫురితసం♦పూజ్యుండవం చెంతు నా
వననూంయూరికి మేఘసన్నిభమయాప. ౨౧

మ. నిరతమ్మున్ భవదంఘ్రిపద్మములు సం♦సేవింపగా గోరు స
ద్వరనిష్ఠుల్ సనకాదులున్ గురుగుణో♦ద్యుక్తప్రభాకారులం
దరు నీలోకమునన్ వసింతురది స♦ద్వైకుంఠమై యెన్న గు
ధామంబై యలరారుదంతయును నాప. ౨౨

మ. నినుధ్యానింపక యున్న దేమరణమా♦నిన్నెన్న ధన్యుండనౌ
గనుకన్ నిశ్చలయోగమార్గనొగి వీ♦కన్నిచ్చి గట్టింపవే
తనివిం జెందని మోహజాలముల స♦ద్దంతాదగం దూల్చి నీ
వనుకూలంబుగ దిద్దవేడెదను నాప. ౨౩

మ. ధరషట్శాస్త్రసుజంబుకంబులటవిన్♦దర్పించి మోహాయుంగనా
తరివేదాంతమృగేంద్రమందుజని సో♦త్కంఠాప్తిగర్జింపగా
నరిగెన్ ఫేరవముల్ నికుంజములకున్♦నానావిదాధ్వంబులన్
పరువెత్తన్ దలపూనదాహరి మహాప. ౨౪

మ. కులమున్ బోవిగ నొక్కనిన్ శిసువగా♦ గూర్మిన్ సదా
[గాంచిమమే
వలనన్ గావగ తత్కులమ్ము విడునే♦ప్పట్లన్ స్వదేశమ్మునో

మలవంబుంబలెదాదలంచి శస్త్రా ◆మంబొప్పగావిడునో కే
వల మానాత్మనెరుంగవీవు సదమా మాప. ౭౫

మ. అచలంబుల్ ధరినంతకంటె చరముల్ ◆నంతంబగన్ బుద్ధిజీ
వచయంబుల్ నరులంతకంటె నధికుల్ ◆ నర్థిజ్ఞులా బ్రా
[హ్మణుల్
రుచిజెంపొందుదు రందు పండితులునుఃస్మృత్యుక్త మహా
[కర్తలున్
బచరించందగు బ్రహ్మవాదులిలనాప. ౭౬

శా. రంగత్తుంగ తరంగ సంగతపయో ◆ రాశిన్ నపుల్ దాటరె
భృంగిన్ దాని గజేంద్రముల్ గనిరెత ◆ త్త్వజ్ఞ్యాని మందాద్రిదే
భంగమ్ముల్ గనలేక యజ్ఞులు వ్యథల్ ◆ వ్యర్థంబుగా
[గాంతురా
భంగమ్ముల్ గని సంతసింతురి బుధులాప. ౭౭

మ. నరుడెన్నో భవముల్ గనన్ సుకృతియై ◆ నన్ జెందు
[సత్సంగతిన్
వరుసన్ సాధనసంపదల్ మననముం ◆ భావించి తత్త్వా
[సనున్
గురితోనాత్మ విచారముంగనిమహా ◆ కూపారసంసారముల్
బరిహానంబొనరించు చిద్ఘనతనాప. ౭౮

మ. అరయన్ కర్మరులెల్లకర్మవిడరా ◆ దంచున్ మరిన్కర్మయో
గరహస్యాత్మకులెల్ల బ్రహ్మపరతన్ ◆ కర్మాళిజేయంగసాం
ఖ్యరతుల్ క్రీడమునన్యసించుటయనన్ ◆ గాలేదు భేదంబునా
పరమా యందరికొక్క కర్మమెటులాప. ౭౯

మ. అరుదౌజీవున కాత్మసౌఖ్యపదమై ◆ శ్యంబేర్పడన్ జేతురున్
స్థిరమాకర్మవిధాన మంతవతరున్ ◆ సిద్ధంబు ముమ్మాటికిన్

పగగన్నిర్మల కర్మయోగపరమా ♦ ధ్యానాత్ములున్ [సాంఖ్యులున్
వరుసంజెంద పథమ్మదొక్కటియె యాప. ౮౧
మ. తొలుతన్నీవు తమోగుణంబున నుపాధుల్ సర్వముల్ [జేసిని
స్తులవిక్షేపణశక్తి జీవకళనం ♦ దున్ వేర్వేరవేసించియా
వలనీలోకములెల్ల జూపితివిగా ♦ బ్రహ్మాండభాండాకృతిన్
బలెవిశ్వంభర నిన్నెరుంగనెవడోప. ౮౧
మ. అలనీజీవచయుంబు తత్త్వదుచితం ♦ బౌరీతి నాకర్మలన్
లలిజేయన్ విహితంపు రూపములదా ♦ ల్పన్ శక్తికల్పించికే
వలసాక్షిత్వమునంది పొందవెటనీ ♦ భవ్యప్రభావంబునీ
బలమున్నీవయెరుంగు దాత్రిహరయాప. ౮౨
మ. గురువేబ్రహ్మయు విష్ణువున్ హరుడును ♦ గూడార్థమంజా [ధ్యమున్
గురువేసత్యము నిత్యమున్నిగమవా ♦ గ్గోప్యంబు వేద్యంబురా
గురువేదేశము కాలమంతయు గలం ♦ డున్ గొంతనిందేల [యో
పరమాత్మా యతడీవకానె గసనాప॥ ౮౩
శా. నీపాదంబుల మ్రొక్కజాలు కరముల్ ♦ నిన్ జూచు నేత్రం [బులున్
నీపై న్యాసమునిల్పు నెమ్మనమునున్ ♦ నీమాటపై కర్ణముల్
నీపట్లన్ జరియించు పాదయుగముల్ ♦ నిన్నెంచు వాగ్వృత్తిని
ష్పాపంబౌబ్రతుకున్ సతంబొసగుమాప॥ ౮౪
శా. ఓనాగేంద్రశయాన ఓనగధరా ♦ యోసవ్య దుర్వ్యాస్త్రాబరా
ఓనీరేజదళాక్ష యోనిరుపమా ♦ యోనిర్గుణా యోహరీ

పరగన్నే ననిబల్కఁ జూచెడియహం౹బ్రహ్మాస్మివాక్యంబుదా
బరగుఁ జూడఁగ నాయజుశ్శ్రుతిని యాప. ౯౧

మ. విమల త్వం పదవాచ్య జీవుఁడవు నీ౹వే తత్పరబ్రహ్మమే
సమరంగా నసి వాక్యమైతివటునీ౹ తుచ్ఛప్రభావంబు దే
వ మరుస్మోనివరా ప్రమేయ పరమ౹ప్రాశస్త్యమా నీవె త
త్వమసీ వాక్యము సామవేదవిధ యాప. ౯౨

మ. ఎవరానందమయుండటంచుమదిని౹న్నెంచంగఁగాంక్షింతురో
యెవరీసర్వ చరాచరాత్మక జగం౹బీవంచు లో నెంతురో
యెవరే కర్మచయంబు బ్రహ్మమనియెం౹తే నిష్ఠఁగావింతురో
భవదాంతర్యులటన్న వారెగద యాప. ౯౩

మ. ఛత్రాందోళిక చామరాదులసెబా౹నంచుఁ దగందాల్చులో
కత్రాణార్హులు భూపతుల్ జనిరి యా౹కాశాదులే మిథ్యలీ
చిత్రించెవ్వరెఱుంగు సద్బుధగణ ౹ శ్రీమూలకందంబు స
త్పాత్రంబుంగద నీవిలాసము యాప. ౯౪

శా. భక్తాగ్రేసరులెందరిం దయను బ్రో౹వంజూచియున్నావొ స
ద్భక్తిం గూర్చి యనుగ్రహింపుము సుధా౹ ధారాసువా [గ్ధాటి సం
సక్తింగా భాసగించవేగ పసుమే౹సందేహముల్ లేక స
ద్భక్తిన్ నిన్నునుతింతు పద్యముల యాప. ౯౫

మ. తన దారాసుతులన్ భరింపఁగనుచుం ౹ దాస్యంబుపై [గోర్కి భూ
ధనమన్నం గడునీప్సితంబు పశుసం౹తానంబుపైగాంక్ష జీ
వనమన్నం క్షణభంగుర మ్మహహ యీ౹వాశాబ్ధి దా [టించు పా
వనమూర్తీ సకలార్తి సంహరణ యాప. ౯౬

మ. ఇలదారిద్ర్యనకొట్టి దారువులిడన్ ◆ ఖం పొందజీర్ణించునే
కల ధన్యున్మృదు భోజనంబయిన ప్ర◆క్కంజేరి జీర్ణింపదా
ఫలసంజూడిన కష్టమందె సుఖమి◆వ్వాస్త్ర న్విచారించినన్
బలుసౌఖ్యంబులు కష్టమందిముదు నాప. ౯౭

మ. అతితర్కంబున బుద్ధిచంచలమగున్ ◆ యద్వైర్యముల్ [భిన్నముల్
గతియాధీరులమాంగణమెన్నటికి ని◆క్కంబై నతద్వృత్తినిన్
జతురుండై తినకాలముం గడపుచో ◆ సాయుజ్యమీ [నేర్తువో
పతితుండైన భవత్కృపంగనడె యాప. ౯౮

మ. ఒకమారేనినిన్ స్మరింపనిజమం ◆ దూహింపసౌశేభవ
త్ప్రికటానర్గళ నిర్గళ ద్విమలశుం ◆ భద్భవ్య దివ్యప్రభా
ప్రకచస్ఫార సురాపగా ఘుమఘుమా ◆ విఖ్యాతభంగాకృతీ
భవుకంబౌ తవ పాదకంజముల నాప॥ ౯౯

మ. తపముల్ జేయుదమన్న కిరదు సదా ◆ ధ్యానంబునుంగోరదే
జపమన్నంబని బూనదీమనము స◆త్సంగత్యముంజేయదే
నపమెన్నన్ధగునంచు జేకొనును నీ ◆ నేస్తంబుమప్పించిగా
వ పరాకేలర పాపభీకర మహాప॥ ౧౦౦

మ. ధరపుత్రుల్ జనియింప ముక్తిదొరకన్ ◆ ఘనత్వమానందురీ
నరులందెవ్వగి కెప్పుడే సుతులగ ◆ న్నన్ ముక్తిచేకూరెనే
యురుదానియ్యాది జ్ఞానపుత్రులవా దవన్ ◆ న్యాయ్యంబుగా [నబ్బునా
పరమజ్ఞాన సుధాబ్ధిజేర్చునను నాప॥ ౧౦౧

మ. ధరభస్మాసురు డీశుగోరితపము ◆ ద్యచ్ఛక్తితో జేయగా
పరమిాతేదెవారుంశు హస్తమిడనె ◆ వ్వాండైన భస్మంబుగా

వరసిద్ధింగన నీశుమస్తకముపై ♦ వాకొనెగెత్వట్ట వ
త్సరమామష్టుని బూదిసేసితిమహా ప॥ ౧౦౨

మ. ఒకవార్త న్విన మోదమానపురుషే ♦ రొక్కంట శోకమ్ముకొం
డొకసల్లాపము విన్న శాంతమును నిం ♦ కొక్కంటనా బాధకం
బొకవేళందగుసత్ప్రమోదమటదా ♦ నెందున్ మతిభ్రంశమీ
వకదా వీనిహరింపజేయుదు మహా ప॥ ౧౦౩

మ. కననింపై యసమానమై యమృతమై ♦ కల్యాణసంధాయమై
వినుతింపందగి చిద్ఘనంబగు సుఖా ♦ విర్భావ విఖ్యాతమై
జనునీధ్యానము సన్మముక్షులకునై ♦ జం బద్ధికా దేదినా
పనిజేయంగఁ కర్త లెవ్వరిక నాప॥ ౧౦౪

శా. భక్తాగ్రేసరు లెందరింకయును బో ♦ వఁజూచియున్నావొ స
ద్వ్యక్తిగా గూర్చి యనుగ్రహింపుము సదా ♦ వాగ్ధాటిలో
[నన్ను నా
సక్తుంగా బొనగింపనేగ ననుమీ ♦ సందేహముల్ లేక స
ద్భక్తిన్నిన్ను నుతింతు పద్యముల నాప॥ ౧౦౫

మ. పరగన్ దుందుభి వత్సరంబున ఘనున్ ♦ పద్యాళితో వేడగా
కరమూహాజ్జనియింపజేసి తుదకున్ గా ♦ జూచియాయేటనే
బరగన్ కార్తిక శుద్ధపూర్ణిమనునా ♦ పద్యంబులన్ గొంటివో
పరమాత్మా నినుగొల్చెదన్ సతము నాప॥ ౧౦౬

శా. ఆపద్బాంధవ నీదుకీర్తి సఫలం ♦ బౌనట్లు నన్నాదుకో
లోపాలోపము లెంచకీకృతిదయా ♦ ఖండైన నీకిచ్చితిన్
కాపాడంగలవాడ వీవెకదనే ♦ గామింప నేకోర్కులన్
పాపాఖిల దవానలాయ విరళాప॥ ౧౦౭

# లక్షణగ్రంధములు

—:o:—

1. అహోబల పండితీయమను కవిశిరోభూషణము.

సంస్కృతవ్యాఖ్యకు సమగ్రమగు తెలుగు 2—[illegible]—0

2. సర్వలక్షణసారసంగ్రహము కూచిమంచి తిమ్మకవి 0—

3. ఆంధ్రఛందోలోకము. అడిదముసూరకవి తెనిగించిన జయదేవకవి విరచిత సంస్కృత చంద్రాలోకమునకు సరిచేసి ప్రచురింపబడినది. 0—6

4. కాగడా. శబ్దరత్నము కాశీభట్ల బ్రహ్మయ్యశాస్త్రి. 0—2—

5. ఆంధ్రసాహిత్యదర్పణమను ఉపన్యాసోపయుక్తవిషయిక దర్పణము. 1—4—0

నందిరాజు చలపతిరావు.

6. బాలసాహిత్యము. ఛందోలక్షణము. 0—4—0
నందిరాజు చలపతిరావు.

పయివిలాసము:—ప్రొప్రయిటరు, మంజువాణీముద్రాక్షరశాల
ఏలూరు, కృష్ణాజిల్లా.